యిదే పద్ధతిని అనుసరిస్తున్నాయి. దీని తరువాత డైరక్టరుగారు పై కథను కట్టుబడి, ఆ కథానాయికను దృష్టిలో పెట్టుకుని డైరక్టు చేయాలి ఆమె నటనకుగాని, నాయికా పాత్రకుగాని పనికిరాదంటే సినిమా తీయటమే వుండదు గనుక ఆమెతోనే సరిపెట్టుకుంటాడు డైరక్టరు. పోనీ యిలా లేకుండా స్వేచ్ఛవున్న డైరక్టర్లకు అనుభవంతక్కువ. వీరికికూడ ప్రజాజీవితంతో సంబంధముండదు. ప్రజామనస్తత్వం రోజురోజుకు ఎలా మారుతున్నదో వీరికి తెలియదు. బాక్సాఫీస్ సిద్ధాంతాలు వల్లించి సినిమా డైరక్టు చేస్తాడు. ఇంక ఈ డైరక్టర్ల అభివృద్ధి అంతా హిందీ, ఇంగ్లీషు చిత్రాలు చూడటం పైనే ఆధారపడి వుంటుంది.

సరే మాటలు - పాటలు వ్రాసే కవులను చూద్దామన్నా యిదే అధ్వాన్నస్థితిలో వున్నారు. వీరికి పూర్తి స్వేచ్ఛ మాటలు - పాటలు వ్రాయడంలో లభించటం లేదనే చెప్పాలి. ప్రొడ్యూసర్ చెప్పినట్లు కథ వ్రాయాలి. డైరక్టరు చెప్పినట్లు మాటలు - పాటలు వ్రాయాలి. పోనీ వీరికి స్వేచ్ఛ లభించినా ప్రజాజీవితంతో సంబంధం చాలమందికి కరవై రచనలు చాల పేలవంగా వుంటాయి.

మన సంగీతంలో అంతా హిందీ అనుకరణే కనబడుతుంది. హిందీ సంగీతాన్నుండి మనం నేర్చుకోదగ్గ సంగతులు అనేకం వున్నాయి. మన సంగీతాన్ని ఆధారం చేసుకుని, హిందీ అనుభవాన్ని తీసుకుని సంగీతాన్ని సమకూర్చితే సరిపోతుంది. కాని హిందీ సంగీతాన్నే మక్కీకి మక్కీగా ఆంధ్ర చిత్రాలలో ఇరికించటంవలన సంగీతం చాల చౌకబారుగా వుంటోంది.

సినిమా సాంకేతిక నిపుణతలోకూడ మన పరిశ్రమలో శ్రద్ధ లోపించింది. ఇప్పుడు చిత్రం ఎలావున్నా ఎవరు ముందు తీస్తే వారిదే గొప్ప. అలా తీస్తేనే మంచి డైరక్టరు. ఈ మూడు నెలల సిద్ధాంతంవలన (3 నెలలలో సినిమా తీయటం) సాంకేతికాభివృద్ధికి అవకాశం లేకుండాపోతున్నది. పెద్ద పెద్ద ఫిలిం సంస్థలు కూడ సాంకేతికాభివృద్ధి దృష్టిలో పెట్టుకుని చిత్రాలు తీయకపోవటం శోచనీయం.

ఈ పై కారణాలవల్ల సాంఘిక చిత్రాలు దెబ్బ తింటున్నాయి ఈ సంవత్సరంలో విడుదలైన సాంఘిక చిత్రాలలో 'అంతా మనవాళ్లే,' 'పెద్దమనుషులు', 'జ్యోతి' చిత్రాలు ఎందుకు ప్రజలకు నచ్చాయి? సహకారసంస్థలలో జరిగే మోసాలను చిత్రిస్తూ, మనవాళ్లే అనుకున్నవాళ్లు మన నెత్తిమీద ఎలా చేతులు పెడతారో చూపే చిత్రం "అంతా మనవాళ్లే", ఊరూరా వున్న పెద్దమనుష్యుల మోసాలను బట్టబయలుచేసే చిత్రం "పెద్ద మనుషులు"; కథలో కప్పదాట్లు వున్నప్పటికి స్త్రీ స్వతంత్రజీవితాన్ని గడపటానికి సంఘంలో ఎన్ని కష్టాలు పడాలో చిత్రించిన చిత్రం "జ్యోతి." ఈ సమస్యలన్నీ ప్రజలకు దగ్గరగా వున్నాయి గనుకనే ప్రేక్షకుల ఆదరాభిమానాలు ఆ చిత్రాలకు లభించాయి.

ఈ కారణాలవలన సాంఘిక చిత్రాలు ప్రేక్షకుల మన్ననలను పొందలేకపోతున్నాయి. దీనిని ప్రొడ్యూసర్లు గ్రహించటానికి నిరాకరిస్తున్నారు. అందువలననే ఆంధ్రలో కొందరు ప్రొడ్యూసర్లు సక్కుబాయి, సావిత్రి, భక్త రామదాసు, కాళహస్తి మహాత్మ్యం మొదలగు పౌరాణిక చిత్రాలను తీయబోతున్నారు. అంటే ఈ ప్రొడ్యూసర్లు ప్రజల సమస్యలను, ప్రజల అభిరుచులను తెలుసుకోడానికి నిరాకరిస్తున్నారన్నమాట. ప్రజలలో పూర్వం వున్న సనాతన భావాలను ఉపయోగించుకోవాలని ఈ చిత్రాలను తీయబోతున్నారు. కాని ప్రజలు పూర్వం వున్నట్లు లేరు. ఆంధ్ర ప్రజలు సాంఘికంగా చాల అభివృద్ధి పొందారు హేతువాదం అభివృద్ధి అయిన ఈ కాలంలో తిరిగి పౌరాణిక వాదాన్ని ప్రజల నెత్తిమీద రుద్ది డబ్బును గడించాలని అనుకోవటం వెర్రితనం అవుతుంది. నూతన భావాలకు అనుగుణంగా చిత్రాలు తీసే సమర్థత లేకనే ఈ ప్రొడ్యూసర్లు తిరోగమిస్తున్నారు. ఈ తిరోగమనాన్ని ఆంధ్ర ప్రజలు హర్షించరనే తలంస్తాను. ★



హెచ్. ఎమ్. రెడ్డిగారు "గృహలక్ష్మి" చిత్రాన్ని తమిళంలో పునర్నిర్మిస్తున్నారు. ఈ నెల 12 న ప్రారంభోత్సవం జరిగింది. అసోసియేట్ డైరక్టరు బంగార్రాజు, నటుడు రఘునంద్, ముఖం, ప్రొడక్షన్ మేనేజర్ పురుషోత్తంరెడ్డి, కెమెరా అన్నయ్య మున్నగువారు పైఫొటోలో వున్నారు.

# "సంఘం"

వర్ణవిభేదాలు రూపుమాసిపోవాలనీ, వర్ణవిభేదాలు పోతేనే భారతదేశం అభివృద్ధి చెందుతుందనీ, ఆ విభేదాలు పోవటానికి వర్ణాంతర వివాహాలు జరపడం మంచి మార్గమనీ ఉద్బోధించే "సంఘం" అనే చిత్రం ఇటీవల ఆంధ్రదేశంలో విడుదలైంది. ఈ నెల 17 వ తేదీన ఈ చిత్రం ఏవి. ఎమ్. స్టూడియోలో పత్రికా విలేఖరులకు చూపబడింది. దీనికి దర్శకుడు ఎమ్. వి. రామన్. మాటలు, పాటలు తోలేటి వెంకటరెడ్డిగారు వ్రాశారు. అంజలీదేవి, ఎన్. టి. రామారావు, వైజయంతిమాల, బాలచందర్, ఎస్. వి. రంగారావు, నాగయ్య, సహస్రనామం, ఋష్యేంద్రమణి, రమణారెడ్డి మున్నగువారు నటించారు.

# "సంఘం"

కులాంతర వివాహం చేసుకున్న ఒక సంఘ సంస్కర్తకు (నాగయ్య) కామిని (అంజలీ దేవి) అని ఒక కుమార్తె ఉంటుంది. కామిని కులంలేని పిల్ల కావడంచేత ఎవరూ ఆమెను పెళ్లి చేసుకోడానికి ముందుకురారు. ఆమె తండ్రి ఎప్పుడూ ఆమె పెళ్ళివిషయమై విచారిస్తూ ఉంటాడు. కామినికి రాణీ (వైజయంతీమాల) అని ఒక స్నేహితురాలు ఉంటుంది. రాణీ మంచి ధైర్య వంతురాలు; బాగా నాట్యం చేస్తుంది; ఈత, సైకిలుతొక్కడం, పరుగు, మొదలైన కసరత్తులన్నిటిలోనూ ఆమెని మించినవారు లేరు. (ఈమె సైకిలుసవారీ చేస్తూ ఏమాత్రం ఆయాసమూ లేకుండా రాగాలొలికిస్తూనైన పాట పాడగలదని మొదటి దృశ్యంలోనే నిరూపించబడింది. ఈవిధంగా అన్నిటిలోనూ అసమానురాలైన రాణీ కారు నడపడంలోమాత్రం రాజా (ఎన్. టి. రామారావు)కు తీసికట్టేనని తరవాతి దృశ్యాల్లో తెలుసుకుంటాము.)

రాజా తండ్రి సీతారామాంజనేయదాస్ (రంగారావు). ఈయన ఆడవాళ్ళమీద అకారణద్వేషంతో మండిపడుతూంటాడు. అందుచేత ఆయన కొడుక్కి పెళ్ళి చేయకూడదని పట్టుబట్టి కూర్చుంటాడు. కాని భార్య రత్నం (ఋష్యేంద్రమణి) పోరు భరించలేక పెళ్ళిచేయడానికి ఒప్పుకుంటాడు. అయితే తనకు నచ్చినపిల్లనే పెళ్ళి చేస్తానంటాడు.

ఇలాఉండగా ఒకరోజున రాజా, అతని స్నేహితుడు చంద్రం (బాలచందర్) కారులో పోతూండగా కామినీ, రాణీ మరొక కారులో పోతూ తటస్థపడతారు. రాజా కామినిని ప్రేమిస్తాడు. ఆమె కులంలేనిపిల్ల అని తెలిసికూడా ఆమెనే పెళ్ళి చేసుకుంటానంటాడు. చంద్రంసహాయం వల్ల రాజా కామినుల వివాహం రాజాతండ్రికి తెలియకుండా జరిగిపోతుంది. కామినికి పెళ్లయినందుకు ఆమె తండ్రి సంతోషిస్తాడు. అయితే ఇంటిలో ఆయన మేనల్లుడైన కెప్టెన్ సుందరం (సహస్రనామం) రంగూనునుంచి తిరిగివస్తాడు. అతడు కామినిని పెళ్లిచేసుకోవాలని ఆశపెట్టుకుని వస్తాడు. కాని ఆమెకు పెళ్లైయిందని తెలిసి మళ్ళీ వెళ్ళిపోతాడు. అతడ్ని వెదుక్కుంటూ కామినితండ్రి బయలుదేరి, అతడెక్కడా కనిపించకపోతే పిచ్చెక్కిపోయి, 'బే ఆఫ్ బెంగాల్'లో పడి మునిగి చనిపోతాడు.

రాజా ఒక కులంలేనిపిల్లను పెళ్లిచేసుకున్నట్లు తెలిసి అతని తండ్రి కోపగించి కొడుకుని వెనక్కి పిలిపిస్తాడు. కులంలేని పిల్లకు గుణంకూడా ఉండదని ఆయన కొడుక్కి నూరిపోస్తాడు. కామినిని తన తల్లిదండ్రులకు చూపిస్తే వారి దురభిప్రాయం మారిపోతుందని రాజా తన భార్యని తీసుకురావడానికి వెడతాడు. అదే సమయానికి కామినిని మోహించిన కెప్టెన్ సుందరం ఆమెను బలాత్కరించడానికి ఆమె గదిలోకి వచ్చి, మళ్లీ బుద్ధితెచ్చుకుని వెళ్ళిపోతాడు. వీరిద్దరూ ఒక గదిలో ఉండడం చూసిన రాజా కామిని మంచిది కాదని అభిప్రాయపడి ఆమెను వదిలివేసి

విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి "మా గోపి" లో చూపులతో మాట్లాడుతున్న జమున, నరసింహారావు



తండ్రిదగ్గరకు పోయి 'నీ యిష్టం వచ్చిన పిల్లను పెళ్ళి చేసుకుంటావా' అని మాట యిస్తాడు. తండ్రి అతనికి రాణీని వధువుగా స్థిరపరుస్తాడు.

రాణీకి రాజా కామినులు వివాహమాడిన సంగతి తెలియనందువల్ల ఆమె కూడా రాజాను వివాహమాడడానికి ఒప్పుకుంటుంది. రాజా, రాణీ పెళ్లిపీటలమీద ఉండగా చంద్రం వచ్చి రాజా కిదివరకే కామినితో పెళ్ళయిందని చెబుతాడు. రాజా మోసంచేశాడని, రాణీ, ఆమె తండ్రీ అంతా నిందిస్తారు. రాజా తన భార్య కులట కనుక వదిలివేసి రెండో పెళ్ళి చేసుకుంటున్నానని చెబుతాడు. అదే సమయానికి కెప్టెన్ సుందరం హాజరై తనకూ కామినికి సోదర సోదరీసంబంధం తప్ప మరేం లేదని అంటాడు. అప్పుడు రాజా తన భార్య పతివ్రత అని గ్రహించి ఆమెను స్వీకరిస్తాడు. రాణీని చంద్రం పెళ్ళిచేసుకుంటాడు. రాజా తల్లిదండ్రులు కామిని కులంలేనిపిల్ల అయినా గుణంగల పిల్ల అయినందున ఆమెతో రాజా కాపురం చేయడానికి అంగీకరిస్తారు. అంతా సుఖంగా ఉంటారు.

ఈ చిత్రంలో సందర్భశుద్ధిలేని సన్నివేశాలు, ఔచిత్యం, ప్రయోజనం లేని పాత్రలు, సాధనప్రాయంగా వదిలివేస్తే చెరిపోయే ఘట్టాల్లో మోతాదు మించిన నటన, అర్థంలేని పాటలు, నృత్యాలు, ఉపన్యాసాలు అన్నీ ఉన్నాయి. అయినా వీటన్నిటినీ భరించి కాలక్షేపం చెయ్యగలిగినవారికి సంతృప్తికరంగానే ఉంటుంది. ఎస్. వి. రంగారావు ధరించిన పాత్ర 'బుడ్డిలో మెల్లగా' ఈ చిత్రంలో వినోదం కలిగిస్తోంది. రంగారావు పాత్రపోషణం ప్రశంసనీయంగా ఉండడాన్ని బట్టి ఆయన కొంత స్వతంత్రించి నటించి ఉంటాడని అనుకోవచ్చు. ప్రొడక్షన్ విలువలలో నిర్మాతలు తప్పులేకుండా చేసినందువల్ల ఆ విషయంలో చిత్రం ఆకర్షణీయంగానే ఉంది. మిగతా విషయాల్లో 'యావరేజ్' చిత్రమని మాత్రం చెప్పవచ్చు.

* * *

“రాజాగారు తలుచుకుంటే దెబ్బలకేం కొదవ” అన్నట్లు, డబ్బు పుష్కలంగా ఉన్న నిర్మాతలు తలుచుకుంటే ప్రేక్షకులకు జన్మలో కనివిని ఎరుగని వింతలు చూపించగలరు. తెరకి దగ్గరగా కూర్చునే ప్రేక్షకులను తమ దగ్గర బంధువులుగా భావిస్తారు కనుక వారినే దృష్టిలో పెట్టుకుని చిత్రాలు తీయడం నిర్మాతలకు పరిపాటి అయింది. 'ఈ కథలకి ఒక తలా తోకా ఉండనక్కరలేదా' అని అడిగే ప్రేక్షకులు తెరకి దూరంగా కూర్చుంటారు కనుక వారిమాటలు తమకు వినబడనట్లే నిర్మాతలు నటిస్తున్నారు. “తలా తోకా ఉంటే అది సినిమాకథే కాదని వాదించే నిర్మాతలుకూడా కొందరున్నారు. తమకు తలా తోకా అంటే ఏమిటో పూర్తిగా తెలుసనీ, తెలిసికూడా కేవలం తెరదగ్గిరి ప్రేక్షకుల వినోదార్థం తలా తోకా తీసివేసి సినిమాలు నిర్మిస్తున్నామనీ వీరు చెబుతున్నారు కనుక వారిమాట నమ్మకుండడంకంటె గత్యంతరం లేదు.

అయితే ఇరవైఏళ్ళు ఒకటోక్లాసుపిల్లలకి చదువు చెప్పడానికి అలవాటు పడినవాడు, బి. ఏ. ప్యాసయినవాడైనా, కొంచెం జాగ్రత్తగా ఉండకపోతే తనుకూడా ఒకటోక్లాసు స్టాండర్డుకు దిగజారిపోతాడు. అలాగే ఎంతకాలం చూసినా చవకబారు అభిరుచులకే ప్రాధాన్యం ఇచ్చి చిత్రాలు తీసే మన నిర్మాతలకు ఆ అభిరుచులే అలవడుతున్నాయని అనుమానించడంలో తప్పులేదు. లేకపోతే ట్రీట్‌మెంటు, స్క్రీన్ ప్లే, డైరెక్షను, ఏదృష్ట్యా చూసినా ప్రాథమిక దశకంటే అధ్వాన్నంగా ఉన్నాయనిపించే చిత్రాలు ఎలా తయారవుతున్నాయి? ★

సోమర్సెట్ మాఘమ్ ప్రఖ్యాతమైన పేరుగల రచయిత. ఎన్నో నవలలు, నాటకాలు, కథలు వ్రాసి పేరుకు పేరూ, డబ్బుకు డబ్బూ ఆర్జించాడు. ఆయన అభిమానులకు ఆయనొక మహాప్రవక్త. ఆయన రచనలు భగవద్గీతలాగ పారాయణం చేసి, రాత్రిళ్లు, పడుకోబోయేటప్పుడు ఆయన పేరు జపించి మరీ నిద్రపోయే వ్యక్తులు ఆంధ్రదేశంలో కూడా చాలామంది కనిపిస్తారు. మాఘమ్ తన పుస్తకాల్లో మానవ స్వభావాన్ని తరిచి తరిచి చూపించాడనీ, మానవుల్లో ఎన్నిరకాల మనస్తత్వాలుండడానికి వీలుందో అన్నిరకాల మనస్తత్వాలనూ చూపించాడనీ వీరు సాధారణంగా అభిప్రాయ పడుతూంటారు.

సోమర్సెట్ మాఘమ్ వ్రాసిన “రెయిన్” కథ ఆధారంగా తీయబడిన “మిస్ సేడీ థాంప్సన్” ఈమధ్య మద్రాసు వచ్చింది. ఇది త్రీ-డీ లో తీయబడిన చిత్రం. త్రీ-డీ టెక్నిక్‌లో వస్తువులు మూడు కొలతల్లో కనిపిస్తాయని హాలీవుడ్ సినిమా వర్తకులు ప్రజల్ని చాలకాలంగా నమ్మిస్తున్నారు. మూడు కొలతల మాట దేవుడెరుగును గాని, ఫొటోగ్రఫీ లోపమో, కళ్ళజోళ్ల లోపమో, ఎంత కష్టపడి చూసినా త్రీ-డీ చిత్రాల్లో డిస్టార్ట్ అయిన ప్రతిబింబాలే కనిపిస్తాయి.

“సేడీ థాంప్సన్” చిత్రంలో నైట్ క్లబ్ ఎంటర్‌టెయినర్ మిస్ సేడీ కథానాయిక. ఈమెను మిస్టర్ డేవిడ్‌సన్ అనే ఒక సంస్కర్త పతిత అనీ, చరిత్రహీన అనీ అసహ్యించుకుంటాడు. ఆమెకు క్రైస్తవ నీతులు బోధించి, విశుద్ధమైన కొత్త జీవితం ప్రారంభించవలసిందని సలహా ఇస్తాడు. ఆమె అతని నీతులను విని వాటిని ఆచరణలో పెట్టబోయేసమయానికి డేవిడ్‌సన్ తనే పతితుడై ఆమెను బలాత్కరించబోతాడు. అందరికీ నీతులు బోధించే తానే ఇలా పతితుడైనందుకు, తనమీద తనకే అసహ్యంపుట్టి డేవిడ్‌సన్ ఆత్మహత్య చేసుకుంటాడు.

అందరికంటె తాను నీతిమంతుడని భావించేవాడు నిజంగా నీచుడై ఉంటాడనీ, వాని హృదయంలో ఎక్కడో అవినీతి దాగి ఉంటుందనీ, ఆ అవినీతిని అణచిపెట్టడానికే పైకి నీతిమంతుడైనట్లు వాడు నటిస్తాడనీ, ఈ ప్రచ్ఛన్న నీచునికంటె బహిరంగంగా అవినీతిగా ప్రవర్తించేవ్యక్తే గౌరవార్హమైనదనీ ఈకథలో సారాంశం.

ఈ చిత్రం నిర్మించిన కొలంబియా కంపెనీవారు మాఘమ్ కథలో లేని కొన్ని బాక్సాఫీస్ ఆకర్షణలు చేర్చారు. పసిఫిక్ దీవులలోని అమెరికన్ మెరైన్ సైనికుల విశృంఖల జీవితం చాలా గొప్పగా ఉంటుందని చూపించబడింది.

సంఘంలో చిత్రవిచిత్రమైన మనస్తత్వాలుకల మనుషులుంటారు: నిజమే. ఇది అందరికీ తెలిసినదే. కొందరు బహిరంగంగా అవినీతి ఆచరించేవాళ్లుంటారు. కొందరు హృదయంలోని అవినీతిని దాచుకొని పెద్దమనుషులవలె ప్రవర్తిస్తారు. ఈ వ్యక్తులు ఎందుకలా ప్రవర్తిస్తారో, వారి ప్రవర్తనకు సాంఘికమైన కారణాలేమిటో పరిశీలించే ప్రయత్నం మాఘమ్ చెయ్యడు. అందుచేతనే అతని కథలు హాలీవుడ్ సినిమా నిర్మాణానికి చాలా అనుకూలంగా ఉంటాయి. ★

(–ఎస్నాక్)